శ్రీ

# గోపాల శతకము.





గ్రంథకర్త:-

పన్నాల వేంకటసుబ్బరాయశర్మ

శ్రీ

# గోపాల శతకము.

పన్నాల వేంకటసుబ్బరాయశర్మ

విరచితము.

( ఋణవిముక్తి )

గీ. పుడమి నెల్లరు సంతాన • పూర్వకముగఁ
బైతృకఋణమ్ముఁ దీర్పంగ • వలయుఁగాన
దాని నేనిప్డు "సప్తసం • తాన" కలిత
కృతిముఖంబునఁ దీర్చి త • రించువాఁడ.

మొదటికూర్పు 1000 ప్రతులు.

వెల ౪ అణాలు

1933.

# తొలిపలుకు

రచన లన్నిటియందును శతకరచన దుర్ఘట మందురు. ఏలయన నితరకృతులు వివిధవృత్తములతోను వచనములతోడను గూడియుండును గాన భావమును వలయునట్లు పెంచుటకును, తగ్గించుటకును, దగిన సావకాశముండును. శతకమన్ననో అట్లుకాక మకుటమునుబట్టి ఒకేవృత్తమందు చెప్పవలసియుండుటను, అందును సీసమునకుఁ గొన్నిచోట్ల నన్నిపాదముల భావ మొకేవిధముగా నుండవలసియుండుటను; నయ్యది పండితసాధ్యమనియే చెప్పవలయును. అట్టిదాని నల్పజ్ఞుఁడనగు నేను రచియించుట దైవసహాయముచేననుటయతిశయోక్తికాజాలదు

పద్యము లన్నియు భక్తిలోనుండిన బాగుండునని కొందఱుభక్తు లభిప్రాయ పడవచ్చును. కాని "లోకోభిన్నరుచిః" అనుటచేతను, "ఏకస్వాదు నభుంజీయాత్" అనుటచేతను; సర్వజనాదరణీయముగా నుండుటకై దైవానుగ్రహముచే యథాశక్తి భక్తి, జ్ఞాన, వైరాగ్య, స్తోత్ర కథాభాగములునుగొన్ని ప్రపంచధర్మములును జేర్చి కూర్చితిని.

ఇందెందైననుఁగల భావ మేరికైన నయిష్టముతోచినను, ఇతర లోపములున్నను, నాయం దసూయపడక భుక్తకబళ మందలి చిఱుతరాతివలన నించుక దంతబాధయొదవిన నద్దాని మాత్రమే విసర్జించి పాత్రయందలి పదార్థమంతయు విడువక నెటుల భుజింతురో అటులనే పాఠకులు దీని నామూలాగ్రము పఠించి గుణగ్రహణపారీణు లగుదురుగాత.

శ్రీముఖ సం॥
కర్లపాలెం,

ఇట్లు, భక్తజన విధేయుఁడు;
పన్నాల వేంకట సుబ్బడు. (గ్రంథకర్త)

# పండితాశీస్సు.

ఈ శతకమును చివరశ్లోకములతో సహా చూచితిని. శైలి చాల యింపుగానున్నయది. ఇది యిటులుండగా:—

శా॥ పన్నాలాన్వయమందునం బొడమి తేఁ ◆ బట్టె ముక్తికన్యాకరా
ప్తిన్ నీరంధ్రసుఖంబు పొందెఁ గొనఁగన్ ◆ వేదాంతగాథ స్వభూ
వన్నాలీకములన్ గవిత్వసుమ సం ◆ భారమ్మునం గొల్చుచున్
బన్నాలాగి ఋణాల వీగి మను సు ◆ బ్బారాయ దీర్ఘాయువై॥

ఇంటూరు. 19—7—33 } ఇట్లు, చల్లా పిచ్చయ్యశాస్త్రి, హైస్కూలు ఉపాధ్యాయులు.

కం॥ అన్నా! నీ శతకము, కవి
సన్నుతము, పఠించి, దాని ◆ చవు లేమరకుం
టి; నీ కాదైవ మొసం
గు, న్నిహ పర సౌఖ్యములను ◆ గూరిమితోడన్॥

బందరు. 22—7—33 } ఇట్లు, భువనగిరి కోదండపాణి. జాయంటు రిజిస్ట్రారు.

కుమారా! దీనిం జూచితిని, నానాటికి కవిత్వమున రసపుష్టికై చేయు పరిశ్రమ ప్రశంసనీయము. ఇంకను వృద్ధిఁ గాంచి పెక్కు గ్రంథముల రచింతువుగాక. మఱియు,

ఉ॥ భక్తికి సాధనంబు బహు ◆ భంగు లటంచు వచించు నట్టిలో
కోక్తి నెఱింగి నీదు విన ◆ యోక్తి నెఱింగి వచింతునింత నీ
శక్తికిఁ జాలు నియ్యది ప్ర ◆ సంగము కాదు నిజంబుఁ దెల్పెదన్
ముక్తికి కారణంబిదియె ◆ మోదము గొల్పెదు సుబ్బయాహ్వయా॥

గుంటూరు. 31—7—33 } ఇట్లు, భువనగిరి బుచ్చివరదేశి సోమయాజులు సౌగంధిక పుష్పాపహరణాది గ్రంథకర్త.

# అంజలి.

సీ॥ బాల్యమ్మునుండియే • పాటవద్యంబైన
నేకద్విసంధ గ్ర • హించు నట్టి
పనుల సందడిసైనఁ • బాలుమాలక సదా
హరిహర భజనంబు • జరుపునట్టి
తగురీతిఁ బిన్న పె • ద్దలకింట నిత్యంబు
గృహకృత్యముల నెఱిఁ • గించునట్టి
అప్పుసొప్పులకైన • నన్యగృహములకు
సాధారణంబుగాఁ • జననియట్టి
గీ॥ నన్ను నవమాసములు మోసి • కన్నయట్టి
జనని ఋణభారమును దీర్చు • కొనఁదలంచి
సుజన వినుత గుణాలంబ • సుబ్బమాంబ
కంజలియొనర్తుఁ బ్రారంభ • మందు భక్తి॥

శ్రీ వేమన గ్రంథాలయము.
తేలప్రోలు
౧ కృష్ణాజిల్లా.



ఓమ్

శ్రీహరిహర పరబ్రహ్మణేనమః

# గోపాల శతకము.

శ్రీ



నీలరుచిజాల ♦ శృంగారగాత్రంబు
ఘనతర కాలమే ♦ ఘంబు గాఁగ
దనువుపై మెఱయు ప ♦ చ్చనిపట్టుపుట్టంబు
లలిత సౌదామినీ ♦ లతిక గాఁగ
బద కటికర గళా ♦ భరణ నిక్వణనముల్
జలధర గర్జనం ♦ బులునుగాఁగ
సిగను జెన్నలరారు ♦ శిఖిపింఛ దీధితుల్
ప్రవిమల శక్రచా ♦ పంబు గాఁగ
గోపికా గోపసమితిపైఁ ♦ గురిసినట్టి
నీకృపావృష్టి నాపయి ♦ నేఁడు పఱపు
సాంద్రకరుణాలవాల వి ♦ శాలశీల
భక్తజనజాల లోల గో ♦ పాలబాల. ౧

సీ. వేదవేదాంతముల్ ♦ వినినైన నెఱుఁగను
గావ్యనాటకములఁ ♦ గాంచియెఱుఁగ
లక్షణగ్రంధముల్ ♦ వీక్షించియెఱుఁగను
శాస్త్రపురాణముల్ ♦ చదివియెఱుఁగ
నీగుణంబులెఱింగి ♦ నిన్నువర్ణింప నే
నెంత నీకృప నించు ♦ కంతభక్తిఁ
దప్పు నొప్పనుమాటఁ ♦ దలపున నెంచక
తల్లిదండ్రులకడఁ ♦ దనయుఁడాడు
వచ్చియునురాని యవ్యక్త ♦ వాక్కులటులఁ
జెప్ప నెంచితి శతకంబు ♦ చిత్తగింపు ॥సాం॥ ౨

సీ. దండిబ్రహ్మాండోద ♦ రుఁడ వా దేవకి
యుదరంబునం దెట్లు ♦ లుంటివయ్య
జన్మకర్మాదుల ♦ జాడఁగాననివాఁడ
వెట్టుల బుడుతవై ♦ పుట్టితయ్య
అజహరాదులకైన ♦ వందనివాఁడవు
గోపబాలురనెట్లు ♦ కూడితయ్య
వేదవేదాంతాది ♦ విద్యాకృతివి చూడ
సాందీపుకడ నేమి ♦ చదివితయ్య
యేమనివచింతు నీభావ ♦ మెట్లు తెలియుఁ
జిత్రము కదయ్య నీదుచ ♦ రిత్రమెల్ల ॥సాం॥ 3

సీ. ధర్మంబుతఱిగి య ♦ ధర్మంబు పెరుగంగ
యుగయుగంబందున ♦ నుదయమొంది
శిష్టరక్షణ దుష్ట ♦ శిక్షణఁ గావించి
ధర్మసంస్థాపనఁ ♦ దగ నొనర్తు
ననుచుగీతల నర్జు ♦ నునకు బోధయొనర్చి
రణమునఁగౌరవు ♦ లను వధింపఁ
గంసాది వైరులఁ ♦ గడిమిఁ ద్రుంపఁగ నిల
పైమానవాకృతిఁ ♦ బడసినట్టి
యాదివిష్ణుఁడవుంగాక ♦ యరయ సహజ
మనుజమాత్రుఁడ వెట్లాదు ♦ మహితచరిత॥సాం॥ ౪

సీ. ఒకచేతకోల వే ♦ ఱొకచేత వేణువుఁ
బట్టి పింఛము మౌళిఁ ♦ బరగఁజుట్టి
కర్ణికారంబులఁ ♦ గర్ణంబులను దాల్చి
గురివెంద సరులచే ♦ నురము వెలయ
ధేనురింఖాధూళి ♦ దేహంబుపైఁగప్ప
ఘర్మబిందువులు మై ♦ గమ్మనందు
ముత్యంబులటుదోప ♦ ముంగురుల్ నృత్యంబు
సల్ప నిల్చుచు తరు ♦ చ్ఛాయలందు
గోపకులఁగూడి గోవుల ♦ మేఁపునీదు
రూపమును నాకు నొకపరిఁ ♦ జూపుమయ్య॥సాం॥ ౫

సీ. సత్యసంభాషణ! ♦ శాత్రవశోషణ !
సత్కవిపోషణ! ♦ శరణుశరణు !
పంకజలోచన! ♦ పాపవిమోచన !
సంకటనాశన! ♦ శరణుశరణు !
కరివరదాయక! ♦ నిరుపమనాయక !
శరధిజానాయక! ♦ శరణుశరణు !
దురితజాల విదూర! ♦ పరతత్వ సంచార !
సాధుజనాధార! ♦ శరణుశరణు!
సకల సుర నర పోషక! ♦ శరణుశరణు !
జలధిశయన సురార్చిత! ♦ శరణుశరణు ॥సా॥ ౬

సీ. శ్రీకర సుగుణర ♦ త్నాకర భక్తవ
శీకర సర్వలో ♦ కైకవీర
లోకబాంధవ చంద్ర ♦ లోకబాంధవనేత్ర
లోకరక్ష సురారి ♦ లోకశిక్ష
సామజవరపాల ♦ సామగానవిలోల
సామాద్యుపాయన ♦ న్నామధేయ
సురపోష ఖలమదా ♦ సురశోష సుగుణభూ
సురతోష సరసభా ♦ సుర సుభాష
వనజ సువిశాలనయన యో ♦ వనధిశయన
వనధిజారాజ యోగివ్రా ♦ ద్వనజతేజ ॥సా॥ ౭

సీ. పరమపవిత్ర భా ♦ స్కర నిశాకర నేత్ర
కమలాకళత్ర శ్రీ ♦ కంఠమిత్ర
వరపుణ్యచారిత్ర ♦ పురుహూతనుతిపాత్ర
దేవకీ ప్రియపుత్ర ♦ దివ్యగాత్ర
యతికంజమిత్ర యా ♦ శ్రిత సంసృతివిచార
వల్లీలవిత్ర దు ♦ ర్వైరిజైత్ర
కార్యకారణసూత్ర ♦ కర నఖోద్ధృతగోత్ర
యత్యలంఘ్యభవాబ్ధి ♦ యానపాత్ర
దివిజ నతపద శతపత్ర ♦ ధీవిచిత్ర
దురితవనవీతిహోత్ర కిం ♦ కరగణత్ర ॥సాం॥ ౮

సీ. పతితపావననామ ♦ పాలితసుత్రామ
కలుషవిరామ సం ♦ గ్రామభీమ
కరుణాలవాల సా ♦ గర కన్యకాలోల
కరివర పరిపాల ♦ [illegible]కచేల
కవినుజనాధార ♦ కామితమందార
వారిధిగంభీర ♦ మేరుధీర
శిష్టమానవరక్ష ♦ దుష్టదానవశిక్ష
పాండవపక్ష శ్రీ ♦ వత్స వక్ష
భక్తజనగేయ మునిగణ ♦ భాగధేయ
దళితరిపుకాయ నరహరి ♦ దైవరాయ ॥సాం॥ ౯

సీ. భవభయహార పరా ♦ త్పర పరమేశ్వర
కమలనాభ సురేశ ♦ ఖలవినాశ
పరమపూరుష భక్త ♦ భర ధరాధరధీర
వారణపోషక ♦ మారజనక
యనుపమగుణసాంద్ర ♦ యదుకులాంబుధిచంద్ర
వారిదదేహా సు ♦ పర్ణవాహా
వామనమధువైరి ♦ వాసుదేవ మురారి
దీనమానవపాల ♦ గానలోల
భక్తజనలోకపక్ష యా ♦ పన్నరక్ష
లలితమృగమదతిలక ల ♦ లాటఫలక ॥సాం॥ ౧౦

సీ. కృష్ణ శౌరి ముకుంద! ♦ కేశవ గోవింద!
క్షీరాబ్ధిశయన! రా ♦ జీవనయన!
ఆపదుద్ధారక! ♦ యఖిలాండనాయక!
తాపసగణపోష! ♦ దైత్యశోష!
వారిదసుశరీర! ♦ వారిధిగంభీర!
ఘోరపాతకనాశ! ♦ కువలయేశ!
గోపీమనోహర! ♦ గోవర్ధనోద్ధార!
సురవైరిదమన! యో ♦ గరుడగమన
యనుచు నీనామమునుదప్ప ♦ కనవరతము
స్మరణఁజేసినఁ బాపముల్ ♦ సమసిపోవె? ॥సాం॥ ౧౧

సీ. నిరతంబు నీపాద ♦ నీరేజయుగ్మంబు
మానకఁబూజించు ♦ మానవులకు
కనులారఁగా నీదు ♦ కల్యాణరూపంబుఁ
గాంచి యానందించు ♦ ఘనమతులకు
పావక కథల శ్రీ ♦ ద్ధాభక్తియుక్తుల
వీనులవిందుగా ♦ విను నరులకు
నీనామ కీర్తనల్ ♦ నిశ్చలమతితోడఁ
బఠన మొనర్చెడి ♦ వరగుణులకుఁ

గలుగబోవెందు భవబంధ ♦ కర్మతతులు
సత్యమని వాడవాడలఁ ♦ జాటువాఁడ ॥సాం॥ ౧౨

సీ. గోపబాలురఁగూడి ♦ గోవులమేఁపుచు
బృందావనమున గో ♦ బృందమెల్ల
నాహారములుమాని ♦ యాలించునటు వేణు
గానఁబుసల్పంగఁ ♦ దానుగాంచి
తొల్లి యశోద ము ♦ ద్దుగ నిన్ను గోవింద
యనిపిల్చెఁ గూరిమి ♦ నదిమొదలుగ
మందుండునైన గో ♦ వింద'యనుచు నిన్ను
న్మరియించ నెంతయు ♦ నంతసించి

సంతతంబును నిహపర ♦ సౌఖ్యములను
గూర్చెదవు భక్తులకొకింత ♦ కొఱఁతకలదె॥సాం॥౧౩

సీ. నీనామమును నోర ♦ నిశ్చలభక్తితో
విడువకెల్లప్పుడు ♦ నుడివెనేని
బ్రాహ్మణక్షత్రియ ♦ వైశ్య పాదజులైనఁ
గడజాతివాఁడైనఁ ♦ గడకు నెట్టి
పాతకుఁడైనను ♦ భ్రష్టుఁడైనను భువి
జనగర్హితుండైన ♦ జడుఁడునైన
భోగవంతుండైన ♦ రోగవంతుండైనఁ
గుచ్ఛితుఁడైనను ♦ క్రూరుఁడైన
నిందునందును నీకృపఁ ♦ బొందియంత
మందు నినుఁజెంది సంతతా ♦ నందమొందు ॥సాం॥

సీ. గోవింద గోవింద ♦ గోవిందయనుచుఁదా
నానందమున నెప్పుఁ ♦ డాడుచుండు
గోపాల గోపాల ♦ గోపాలయంచు ని
న్నెప్రొద్దు నెవఁడెద ♦ నెన్నుచుండు
శ్రీకృష్ణ శ్రీకృష్ణ ♦ శ్రీకృష్ణయనుచు నిం
జేరి సేవయొనర్చు ♦ చేయుచుండు
మాధవ మాధవ ♦ మాధవయంచు ని
న్నెవ్వాఁడు మాటికి ♦ నెంచుచుండు
నట్టిమనుజుఁడె నిష్కాముఁడై ♦ నట్టి నీదు
భక్తుఁడనఁదగు, వానికే ♦ ముక్తికల్గు ॥సాం॥ ౧౫

సీ. తాఁగన్న వస్తుజా ♦ తము నిన్నుగా నెంచి
తన్మయంబునఁ జేష్ట ♦ లన్నిదక్కి
యుప్పొంగ దేహంబు ♦ కుప్పిగంతులు వైచు
కరపదములు వడఁ ♦ కంగ నెంతొ
గద్గదకంఠుఁడై ♦ కన్నుల నానంద
బాష్పముల్ రాల స ♦ ర్వమును మరచి
తనలోనఁ దానవ్వు ♦ కొనుచు మూర్ఛనుజెందు
నాకలి దప్పుల ♦ కడల కెందు
జడునివిధమునఁ దిరుగు నీ ♦ పుడమియందు
నిక్కమగు భక్తుఁడగువాఁడు ♦ నీరజాక్ష ॥సాం॥ ౧౬

సీ. వీనులుండి యెవండు ♦ వినఁగోరఁ డితరంబుఁ
గన్నులుండియు బయల్ ♦ గాంచఁబోఁడు
వాక్కుండియుఁ ద్వదన్య ♦ వాదనలకుఁబోఁడు
జిహ్వయుండియు రుచుల్ ♦ జెప్పఁబోఁడు
కరములుండియుఁ బెర ♦ కార్యముల్ సేయఁడు
పదములుండియు నన్య ♦ పథముఁజనఁడు
విద్యయుండియు వేరు ♦ వృత్తినాశింపఁడు
మనమున నిన్నెప్డు ♦ మరువఁబోవఁ
డట్టివానిని నీకిల ♦ నాప్తుఁడైన
పరమభక్తుఁడటందురు ♦ భాగవతులు ॥సాం॥ ౧౭

సీ. వివరింప వ్యాధుని ♦ వృత్తి యెయ్యది మును
ప్రహ్లాదునకుఁ గల ♦ వయసదెంత
కరినాథుఁ డేవిద్య ♦ గఱచెఁ గుబ్జకు స్త్రీయు
రూప మేచంద మె ♦ బుంగభువిని
ధనబలంబేపాటి ♦ తనరుఁ గుచేలున
కును జూడ విదురుని ♦ కులమ దేది
యుగ్రసేనుని ధైర్య ♦ మూహింపనెట్టిది
యుదుతకు నెంతటి ♦ యుక్తికలదు
కాన ముక్తికి భక్తియే ♦ కాని వృత్తి
కుల వయో రూప ధన కళా ♦ గుణములేల॥సాం॥౧౮

సీ. సతతాన్నదానాది ♦ సద్దానపరులౌచు
ఖ్యాతిఁగాంచిన మేటి ♦ దాతలైన
జపతపో వ్రతములు ♦ సల్పుచు నిరతంబు
నిష్ఠతోనుండు క ♦ ర్మిష్ఠులైన
యజ్ఞయాగాదుల ♦ నంతముల్ గావించి
దేవలోకము చెందు ♦ దివ్యులైన
సప్తసంతానముల్ ♦ సల్పి యాత్రల కేగి
పుణ్యమార్జించెడి ♦ పూజ్యులైన
నీదుకరుణకుఁ బాత్రులై ♦ నెగడు నీదు
భక్తులందెడు సౌఖ్యముల్ ♦ వడయ లేరు॥సాం॥ ౧౯

సీ. కావలి నేప్రొద్దుఁ ♦ గాచుచు వనినున్న
వనపాలకుండు త ♦ పస్వియగునె?
పొంచి మృగము నేయ ♦ నెంచెడి వ్యాధుని
దృష్టి నిశ్చలయోగి ♦ దృష్టియగునె?
భార్యాసుతాదుల ♦ పైనల్గి యిలువిడి
దేశముల్ దిరుగ యా ♦ త్రికతగనునె ?
కడునిష్ఠఁ జోరుఁడు ♦ కనుమూయ కేరాత్రిఁ
గడపినమాత్ర జా ♦ గరణమగునె ?

తలఁపునను నిన్ను నిలిపినఁ ♦ గలదు కాని
కలదె? యితరాభిలాషున ♦ కిలను ముక్తి ॥సాం॥ ౨౦

సీ. భాగ్యవంతుఁడటంచుఁ ♦ బ్రఖ్యాతిఁ నొందిన
నద్దాన ముక్తిసుం ♦ తైన లేదు
విద్వాంసుఁడని మహా ♦ విశ్రుతిగాంచిన
నద్దాన ముక్తిసుం ♦ తైన లేదు
బలవంతుఁడని కీర్తిఁ ♦ బడసి చరించిన
నద్దాన ముక్తిసుం ♦ తైన లేదు
ఆచారపరుఁడని ♦ యశముఁ గడించిన
నద్దాన ముక్తిసుం ♦ తైన లేదు

దానము పరోపకృతి దయ ♦ దైవభక్తి
కలిగియుండినఁ నద్దానఁ ♦ గలుగు ముక్తి॥సాం॥ ౨౧

సీ. కమలాక్ష నిన్ను ని ♦ క్కపు భక్తిఁ గొల్వక
కాలమంతయు వృథా ♦ గడపినాఁడ
ననవరతముఁ బాప ♦ మనుమాట నెన్నక
యనృతంబులనెన్నో ♦ యాడినాఁడ
వర్ణాశ్రమాచార ♦ పద్ధతుల్వర్జించి
వంచనమెయి నంచ ♦ రించినాఁడ
దానధర్మంబను ♦ తలఁపు లేశంబైన
మదినిఁ దలంపక ♦ మసలినాఁడ
నైన దేమైనదో యింక ♦ నైన నన్ను
దారికినిఁ ద్రిప్పి ప్రోవఁ బ్రా ♦ ర్థన మొనర్తు॥సాం॥ ౨౨

సీ. స్నానసంధ్యాద్యను ♦ ష్ఠానపరుఁడఁ గాను
జపతప స్వాధ్యాయ ♦ సరణిఁ దెలియ
యమనియమాది యో ♦ గాంగంబులెఱుఁగను
గంగాది నదుల మ ♦ నుంగలేదు
భువిఁ బవిత్రక్షేత్ర ♦ ములఁ గానఁగాలేదు
పుణ్యమార్గము పొంతఁ ♦ బోవలేదు
పెద్దలయాచార ♦ పద్ధతిఁ గనలేదు
సురభూసురుల సేవ ♦ జరుపలేదు
మెట్టికాలంబునందునఁ ♦ బుట్టితినొకో
పుట్టువాదిగ నేనొక్క ♦ పున్నెమెఱుఁగ॥సాం॥ ౨౩

సీ. ఆసనంబిచ్చెద ♦ ననుకొన్న బ్రహ్మాండ
మెల్లనిండిన నీకు ♦ నెయ్యదిత్తు
పాద్యమిత్తుననటన్నఁ ♦ బాదమ్మునన్గంగ
పరిభవింప నింకేమి ♦ పాద్యమిత్తు
స్నానార్థమైన య ♦ త్నమొనర్తునన నబ్ధి
శయనుండవగునీకు ♦ స్నానమేల
పువ్వులచేపాద ♦ పూజసల్పెదనన్నఁ
బద పద్మముల ♦ మించు పరిసవమెద్ది
ప్రీతి నైవేద్యమును సమ ♦ ర్పింతమనిన
దేవతలకీవె సుధనియ్య ♦ దేని నిత్తు ॥సాం॥ ౨౮

సీ. మృదుతల్పమై నీదు ♦ మదికిఁబ్రీతినిఁగొల్వ
భోగీంద్రుఁడను కాను ♦ భోగిశయన
భుజము నందిడినిన్ను ♦ భువిఁద్రిప్పి మెప్పింపఁ
బక్షిరాజును గాను ♦ పక్షివాహ
స్వాంతంబు కరుగున ♦ ట్లెంతయు వేడంగ
దంతీశుఁడను కాను ♦ దంతిరక్ష
భక్తిచే నీకృపా ♦ పరతఁగాంచుటకుఁబ్ర
హ్లాదుండఁగానుప్ర ♦ హ్లాదవరద
యెటులఁబ్రోచెదో మదిఁదోచ ♦ దించుకైన
మానసంబున భక్తిన ♦ మస్కరింతు॥సాం॥ ౨౯

సీ. శరణన్నవారి నెం ♦ దఱినో మున్గాచితి
వనివిని నీపాద ♦ వనజములకు
మ్రొక్కితి వాకిట ♦ దిక్కునీవేయని
యొప్పరికించుట ♦ యొప్పుకాదు
దరిగానలేక నీ ♦ దరిజేరినట్టి నన్
దరిజేర్చకున్న నే ♦ దరికిబోదు
పాపాత్ముడని నను ♦ జేపట్టకుందువా
నీపాదములవీడ ♦ నిజమువినుము
పతితపావనుడనెడి నీ ♦ భవ్యయశము
దాచినను దాగదిది యదా ♦ ర్థమ్మునమ్ము ॥సాం॥ ౨౬

సీ. ధనధాన్యములకునై ♦ తరచి కోరగలేదు
భాగ్యమిమ్మని పట్టు ♦ బట్టలేదు
విద్యార్థమై నేను ♦ వేచియుండగలేదు
మేడమిద్దెలు నిన్ను ♦ వేడలేదు
అన్నవస్త్రంబుల ♦ నర్థింపగాలేదు
మడిమాన్యములను ని ♦ న్నడుగలేదు
మోక్షంబుకొఱకు నే ♦ మొఱబెట్టుకొనలేదు
దేవత్వమునకు బ్రా ♦ ర్థింపలేదు
కోరెదను మిమ్ము సేవించు ♦ కొఱకు జిత్త
మన్యథాపోక నిలుచున ♦ ట్లనవరతము ॥సాం॥ ౨౭

సీ. కాపాడఁగా నేరి • దాపుఁజేరనటన్నఁ
గాపాడరావేల • పాపహరణ
ప్రోవంగ నొరు వేఁడఁ • బోవంగనని వేఁడఁ
బ్రోవంగరావేల • భోగిశయన
పాలింపుమని యన్య • పాలికిఁబోనన
బాలింపరావేల • పద్మనయన
రక్షింపనితరు న • పేక్షింపనని మ్రొక్క
రక్షింపరావేల • పక్షివాహ
శరణనేలుమటంచు నిన్ • శరణువేఁడఁ
గరుణనేలవదేల నన్ • బరమపురుష ॥సాం॥ ౨౬

సీ. కరిరాజుమున్ను మ • కరిచేతఁ గడుడస్సి
ప్రార్థింపఁగానేగి • ప్రాణమిచ్చి
కౌరవుల్ పాంచాలి • కట్టుపుట్టములొల్వ
గోవిందయని వేఁడఁ • గోకలిచ్చి
తండ్రిచే సకలబా • ధలఁజెందు ప్రహ్లాదు
పలుకులకై వచ్చి • బాధఁదీర్చి
అన్నచే యవమాన • మందివచ్చిన విభీ
షణునకుఁ గరుణతో • శరణమిచ్చి
మున్నుమన్ననఁ బ్రోచితి • వన్నమాట
లన్నియునుసున్న ననుఁబ్రోవ • కున్న నేఁడు॥సాం॥ ౨౭

సీ. నిరతంబు నీభక్త • వరులఁగూడఁగఁజేసి
యన్యచింతాసక్తు • లణఁగఁజేసి
బంధుమిత్రులప్రేమ • బంధంబువిడఁజేసి
సర్వసమత్వంబు • జరుగఁజేసి
నీయందుఁ జిత్తంబు • నిలకడగాఁజేసి
దుష్కృతంబులనెల్లఁ • దొలఁగఁజేసి
స్వప్నజాగరముల • సైతము నీరూపు
మనమునందెప్పుడే • మరవఁజేసి
కరుణ మీదాసదాసునిఁ • గాఁగఁజేసి
యేలుకొనుమంటి నన్యథా • యెన్నకంటి॥ పా॥ ౩౦

సీ. వసుధ నేపూర్వభ • వంబునఁ జేసిన
పాపంబులకు దయా • పరుఁడవగుచు
"గుడ్డిలో మెల్ల"గా • కొంచెమువ్యక్తిఁ
గలజన్మకన్నులుఁ • గాలునేతు
లాదిగాఁగల్గెనా • కంతియచాలుఁ దా
వకసేవయనెడు ను • పాయమునను
గొండఁబ్రాకఁగనేను • కోరితి నీచిత్త
మెట్టులో నాభాగ్య • మెట్లుకలదొ
తెలియఁగారాదు నీమాయ • తొలఁగఁజేసి
నన్నుదరిఁజేర్పఁగను నిన్ను • సన్నుతింతు॥ పా॥ ౩౧

సీ. కొలిచెద ననుకొన్న ( గోటిసూర్యప్రభా
కలితు నీ దరిఁ జేరి కొలచు టెట్లు
పిలిచెద ననుకొన్న నిలనామరూపంబు
లెలమి లేనట్టి నీ బిలుచు టెట్లు
తల ( చెద ననుకొన్న ( దనువాఙ్మనోవృత్తి
కలవి కానట్టి నీ దల ( చు టెట్లు
నిలచెదననుకొన్న నిఖిలంబునీవయై
నిండిననీకడ నిలుచు టెట్టు
లట్టి వేషంబు లిప్పట్ల ( గట్టిపెట్టి
గట్టిగను మెట్టులైన నన్ గట్టుఁజేర్పు ॥సాం॥ ౩౨

సీ. పుట్టినదాదిగాఁ బుడమి నేచేసిన
పాపంబులేమని పలుకువాఁడ
నెంచ ( గిన వేలెక్క కెక్కువగానుండె
నెటు ( గకచేసిన వెన్ని కలవో ?
మదికి ( దోచదు నాదు మనవిని గైకొని
శమనునికడ ( జర్చ జరుగకుండ
"దాసునినేరంబు దండంబుతో సరి"
చేయుమిర్వురమును జేసినట్టి
దేమొయైనది జన్మరాహిత్యమీవు
చేసినను నేను బాపంబు ( జేయ ( బోను॥సాం॥౩౩

సీ. తండ్రి నాయెడ నీకు ♦ దయకలదేని యీ
తనువు నిల్పుము శాశ్వ ♦ తముగ నట్లు
కాదేని చచ్చి యిం ♦ కను భువి జన్మింప
కుండు లాగున నను మ ♦ ఱొందుపాయ
మరయుమీ రెండు సా ♦ ధ్యము కానిచో నిష్ట
కాదని తెల్పుము ♦ కాయవృష్టి
కలయప్పుడే చేయఁ ♦ గలకార్యమున్న నేఁ
జూచుకొందును నాకుఁ ♦ దోఁచినట్లు
తనువు క్షణభంగురంబౌటఁ ♦ దలఁచి తలఁచి
ఖండితంబుగ నిటులడు ♦ గంగ వలసె ॥సాం॥ ౩౮

సీ. ధరణి సర్వాభీష్ట ♦ దాతవీ వౌటచే
నెద్దానిఁ గోరిన ♦ నిత్తువైనఁ
జూడ భక్తిజ్ఞాన ♦ శూన్యుఁడ నౌటఁ దై
ర్యమ్ము గానాకు మో ♦ క్షమ్ము నిమ్మ
టంచు వచింప నో ♦ రాడదు నాస్థితి
నాకె తెల్లము కాన ♦ లోకనాథ
యెట్టిపుట్టువు ముందుఁ ♦ బుట్టఁ జేసిన నీదు
సేవ సేయ మఱకుండఁ ♦ జేయుమిదియె
కోరినాఁడ "నిరతుర ♦ క్తి" ప్రభుని
గొప్ప యుద్యోగమిమ్మని ♦ కోరఁగలఁడె ॥సాం॥ ౩౯

సీ. చిన్నవై వ్రేపల్లెఁ ♦ బెరుగుపాల్వెన్నల
దొంగిలుటయు గోప ♦ తోయజాక్షు
లనుగూడుటయు గోవు ♦ లనుగాయుటయు జను
లనవరతంబు ని ♦ న్నవనియందు
గోపికాజార యో ♦ గోపాల యోనవ
నీతచోరాయన ♦ నీవువినుచు
నద్దానికలుగక ♦ యతి ముద మందుచు
భక్తవర్యులమనో ♦ భావమెఱిఁగి
వారికోరికలొసఁగి య ♦ వారితముగ
వారినెప్పుడుఁ బ్రోచెదు ♦ వారిజాక్ష ॥సాం॥ ౩౬

సీ. ఒకచెలికానికి ♦ నొసరసంపదలిచ్చి
యొకనినిబిచ్చమె ♦ త్తుకొనఁ జేసి
యొకసోదరునకుస్వ ♦ ర్గోన్నతపదమిచ్చి
యొకనికినాగలి ♦ నొకటినిచ్చి
యొకభార్యనతిప్రేమ ♦ నురమున నెక్కించి
యొకప్రియురాలిఁ గ్రిం ♦ దికినిఁ ద్రొక్కి
యొకబావమఱఁదికి ♦ నొసరిచిసారథ్య
మొకనికి సిగఁ గోసి ♦ వికలుఁ జేసి
తిఁదఃనీకండఅనుసము ♦ లెందుకిట్టి
పక్షపాతమునిష్పక్ష ♦ పాతివరయ ॥సాం॥ ౩౭

సీ. దుర్యోధనాదుల ♦ దురమునఁ గూల్పించి
రాజ్యమెల్లనుధర్మ ♦ రాజునకిడి
యమరసంతతినెల్ల ♦ నమృతంబుఁ దాగించి
యసురగణంబుల ♦ హతమొనర్చి
వాలి నన్యాయిత ♦ వధసల్పి యాతని
భార్యను సుగ్రీవు ♦ పాలుచేసి
బలినివంచనఁ బద ♦ భ్రష్టునిఁ గావించి
స్వర్గమిందునకు నో ♦ సంగితరయఁ
దగవరివి యన్నదమ్ముల ♦ తగవు లీవె
తీర్పవలయును గా కొరుల్ ♦ తీర్పఁగలరె ?॥సాం॥ ౩౮

సీ. ఒకని భూపాలకు ♦ నొకని గోపాలకు
నొకనివిరాగి మ ♦ ఱొకని రాగి
నొకనిఁ బండితుని వే ♦ ఱొకని దండితుని వే
ఱొకని సపుత్రు జే ♦ ఱొరు నపుత్రు
నొకని నారోగ్య మ ♦ ఱొకని ననారోగ్యు
నొకనిఁ బ్రసన్ను మ ♦ ఱొకని ఖిన్ను
నొకని సురూపు నిం ♦ కొకనిఁ గురూపు నిం
నొకసిని ధీరు నిం ♦ కొకని భీరు
నకటచేసితి వింకెన్నొ ♦ రకరకములు
సకలమొకటందురిసి కిట్టి ♦ తిక మకేమి ॥సాం॥ ౩౯

సీ. అడుగిడుచోట మా ♦ అడుగిడ శోకసతి
గడప గడప కిచ్చు ♦ నడుచుచుండఁ
గడమయర్ధాంగి యై ♦ కట్టడనున్న దక్కడ
జనమతివలెనుండఁ ♦ గొడుకొకండు
తడబాటువాగ్రిలెడ ♦ నెడవాగ్రియు రెండవ
కొడుకు స్త్రీ పురుషుల ♦ నడలఁ జేయ
నడుగనక్కఱలేక ♦ విడకఁ గోడలుచెడి
కడజాతికడనైనఁ ♦ గడకునుండ
నడలిధృతి కాపురము సెడ ♦ నడలిపాల
కడలిశయనించితివి యిలు ♦ వెడలినీవు ॥సాం॥ ౪౦

సీ. భువనంబులేలు వగ్రి ♦ భుఁడవీవు హాయదంతు
లెక్కకఁ బక్షిపై ♦ నెక్కుటేమి ?
యసమాన మణి మకు ♦ టాఢ్యుల శిరమునఁ
దాల్పక పింఛంబుఁ ♦ దాల్చుటేమి ?
సప్తాంగసమితితో ♦ జగములనెల్లను
గావక గోవులఁ ♦ గాచుటేమి ?
రారాజు భుజియింప ♦ రమ్మనఁ బోవక
కులహీనుగృహమునఁ ♦ గుడుచుటేమి ?
స్వామి మీకౌతుకముగాక మీ ♦ జాడఁ జూడ
నితరు లెట్లనఁ గలరిద ♦ మిత్థమనుచు ॥సాం॥ ౪౧

సీ. ధనవంతునకు లోభి ♦ తనమును యోజింప
ధనవిహీనునకును ♦ త్యాగబుద్ధి
దుర్మార్గునకు గార్య ♦ దౌర్బలశక్తియు
సన్మార్గునకునెన్నొ ♦ సంకటములు
నగ్రజాతులకు న ♦ త్యల్పవిద్యయు నంత్య
వర్ణజులకును సం ♦ పూర్ణవిద్య
సతతాన్నదాతకు ♦ సంతాన హీనత
నిరుపేదకరయు న ♦ నేక సుతులు
కాఁగఁ జేసితి తత్కృత ♦ కర్మచేత
నంతియే కాని దానినీ ♦ కగునదేమి? ॥సాం॥ ౪౨

సీ. అయ్యా! నిన్ననఁ దగ ♦ నట్టి మాటలఁగొన్ని
తెలిసియుఁదెలియక ♦ పలికినాఁడ
తండ్రివినీవును ♦ దనయుఁడ నే నౌట
నిన్ను నేనును నన్ను ♦ నీవుననినఁ
దప్పుకాదెందఱో ♦ తనయులుండి యొకండు
దుష్టుఁడై తండ్రినిఁ ♦ దూలనాడ
నందనులందఱ ♦ యందునువలెఁ బ్రేమ
నరసిదారికిసాధ్య ♦ మైనవఱకుఁ
దిద్దఁగాఁ జూచునే కాని ♦ తప్పుఁ జూచి
కనికరములేక విడుచునే? ♦ కఠినుఁ డైన ॥సాం॥ ౪౩

సీ. అల కుచేలుని గుప్పె ♦ డటుకుల కెదమెచ్చి
హెచ్చుగ సంపద ♦ లిచ్చినావు
శబరి యెంగిలిపండ్ల ♦ చవికి మోదంబంది
మించిన ప్రేమఁ జూ ♦ పించినావు
కుబ్జగంధంబున ♦ కును సంతసించి సు
రూపినిఁ గా జేసి ♦ ప్రోచినావు
పాంచాలి యిడినట్టి ♦ బలుసాకుఁ గొని పాండ
వుల పరువు నెంతయు ♦ నిలిపినావు
కానఁ దనశక్తి కొలఁది యయ్య ♦ దేని భక్తి
నొసఁగఁ బ్రియమందఁ గోరికె ♦ లొసఁగెదీవు ॥సాం॥ ౪౪

సీ. వసుధ నదితి గశ్యప ♦ వసుదేవ దశరథుల్
ప్రేమసగఁ బోషించిరి ♦ పుత్రుఁడంచు
మును గుచేలుఁడు నరుం ♦ డును గోపబాలురు
మిగుల భావించిరి ♦ మిత్రుఁడంచుఁ
జైద్య పౌండ్రక జరా ♦ సంధ కంసాదులు
చాల దూషించిరి ♦ శత్రుఁడంచు
నితరులు నీకోడ ♦ సతతంబు నిచ్చ నం
భావించి రిల నర ♦ మాత్రుఁడంచుఁ
జిత్తమిడి యంతె కాని యో ♦ జింపరైరి
ఇంచుకంతయు దైవమ ♦ టంచు నిన్ను ॥సాం॥ ౪౫

సీ. దేవనీగుణములు ( ♦ దెలిసి నిక్కంబుగ (
దుదకు శేషుఁడు నా చ ♦ తుర్ముఖుఁడును
వేయినాలుగు నోళ్ళ ♦ వివరింపలేరన్న
నేకవక్త్రిండ నే ♦ నెంత వాఁడ
సకలభూరేణువుల్ ♦ జలరాశి బిందువుల్
గగన నక్షత్రముల్ ♦ గలిసినేని
చాలునో చాలవో ♦ సందేహమయి నిన్న
నంతుండ వనిరి తా ♦ మంతె కాని
యంతుఁగనఁజాల రట్టి బ్రి ♦ హ్మాదు లనఁగ
నింతయనిచెప్ప వేయాను ♦ లెంతవారు॥సా౦॥ ౪౬

సీ. దారులుకొట్టి ప ♦ త్రంబుఁ బెట్టుటకంటె
నన్నదానముసర్వ ♦ కున్న లెస్స
పట్టిగోవునుజంపి ♦ పాదరక్షలుదాన
మొసఁగుకన్నను మాను ♦ టుత్తమంబు
కులనాశకరులైన ♦ కొడుకులఁ గనుకంటె
సంతానహీనత ♦ చాలమేలు
పరువులేకను శత ♦ వర్షములున్నకంటె
ఘనజీవితంబొక్క ♦ గడియబాగు
ఇటులధర్మంబధర్మంబు ♦ నెఱిఁగిభువిని
జనులువర్తింపిఘనతను ♦ గనెదుగాత॥సా౦॥ ౪౭

సీ. శ్రీరాము పట్టాభి ♦ షేక ముహూర్తంబు
కాననవాసంబుఁ ♦ గాఁగమాఱె
సంధికిన్నై హరి ♦ చన నదిపోసఁగక
పైనయుద్ధంబుగాఁ ♦ బరిణమించె
నంబరీషునినోంచు ♦ యాసఁ గోపించు దు
ర్వాసునకే చాల ♦ మోసమయ్యె
కొడుకును జంపంగఁ ♦ గడఁకమైపూనిన
హేమకశిపుండె తా ♦ నీల్గెఁ దుదకు
మదిని తాఁ దలఁచినటులౌనె? ♦ విధివిధాన
మెట్టులో యట్టులౌగాని ♦ యేనికేని ॥సాం॥ ౪౮

సీ. పట్టుఁబట్టి నుతాలి ♦ పొట్ట బట్టల కిడక
గట్టిగా మూటను ♦ గట్టువాఁడు
చుట్టముంగని దారిఁ ♦ బట్టుచుఁ దనపొట్టఁ
గట్టి చేకూరిచి ♦ పెట్టువాఁడు
నెట్టిఖర్చును దల ♦ పెట్టక మాటల
నెట్టెటో కాలమ్ము ♦ నెట్టువాఁడు
గట్టిగ మొఱఁబెట్టి ♦ కొట్టుకొన్నను నీక
పట్టియర్థులఁదిట్టి ♦ కొట్టువాఁడు
తుట్టతుదఁబట్టి యమభటుల్ ♦ గొట్టడస్సి
పెట్టనైతి నటంచెద ♦ బిట్టువనరు॥సాం॥ ౪౯

సీ. పొరుగింటి కనలంబు ♦ దరిఁగొల్పఁ దన గృహం
బునుగూడ దహనమై ♦ పోయినట్లు
పరధనంబును దాన ♦ పహరింపఁబోఁ దన
సర్వంబు దోఁపిడిఁ ♦ జన్నయట్లు
లన్యకాంతాసక్తుఁ ♦ డగుచుఁ దా నేగంగఁ
దనకాంత నితరుఁడు ♦ తగిలినట్లు
ఋణదాతలను ముంచ ♦ నితరులకడ యాస్తి
నుంచ వారలు తన్ను ♦ ముంచినట్లు
ధర్మమునుదక్కి దురిత ప ♦ థమ్ముఁదొక్కి
యొరులఁ జెరుపంగఁ గోరువాఁ ♦ డొందుచేటు॥సాం॥౫౦

సీ. అధిక ధనార్జన ♦ కై యోడవ్యాపార
మునుసల్ప నది నీట ♦ మునిఁగినట్లు
జ్ఞానాభివృద్ధికై ♦ చదువంగ వేసిన
మునువున్న మతికూడఁ ♦ బోయినట్లు
దొడ్డలాభముఁగోరి ♦ వడ్డికి నీయంగ
ననలునకే మోస ♦ మైనయట్లు
హెచ్చువచ్చునటంచు ♦ నెంచి జూదంబాడ
నొద్దనున్నది కూడ ♦ నూడినట్లు
లీశ్వరానుగ్రహములేని ♦ దెవ్వ రెన్ని
విధుల నత్యాశ కేగిన ♦ మొదలుఁ జెడును॥సాం॥౫౧

సీ. మనుజులం దుత్తమ ♦ మధ్యమాధములని
వఱలుచుందురు రట్టి ♦ వారియందు
తనకు నెంతటి నష్ట ♦ మును సంభవించిన
నొరులలాభముఁ గోరు ♦ నుత్తముండు
తా నితరులుఁగూడఁ ♦ దగఁ జెడకుండంగ
మహి సంచరించును ♦ మధ్యముండు
దనకు లాభింప ని ♦ తరులను జెఱుపంగ
నాలోచనమునల్పు ♦ నధముఁడెందు
పట్టివాసికిఁ "బుత్త్రైన ♦ పుట్టినట్టి
బుద్ధిపుడకలతోఁగాని ♦ పోవ" దండ్రు॥సాం॥ ౫౨

సీ. సర్వంబుదహించు ♦ జ్వలనుని బలమన్న
జలమందు నించుక ♦ నిలువఁ బోదు
జ్వలనునినోంచిన ♦ జలశక్తి యెంతయుఁ
సూర్యునిఁ గన్నెత్తి ♦ చూడలేదు
ఉదకంబునింకించు ♦ నుష్ణకరుని తేజ
మరయ మేఘునిచేత ♦ నడ్డుపడును
భానునోడించు ను ♦ ద్భట మేఘుసత్వంబు
వాయుదేవునిముందు ♦ వాసిఁ జెడును
గాన నెంతటి వానికి ♦ నైనగాని
గర్వపడి నిక్కితిరుగుట ♦ ఘనముకాదు॥సాం॥ ౫౩

సీ. సత్య క్షమా శాంతి ♦ జప తప స్సత్కృపా
పరుఁ డైనవాఁ డెపో ♦ బ్రాహ్మణుండు
శౌర్య ధైర్య స్థైర్య ♦ శక్తి గాంభీర్యముల్
కలిగినవాఁడె పో ♦ క్షత్రియుండు
న్యాయార్జితముగ ద్ర ♦ వ్యముఁ గూర్చి కులవృత్తి
వర్తించువాఁడె పో ♦ వైశ్యజనుఁడు
పై మూఁడుజాతుల ♦ వారికిఁ దగిన శు
శ్రూషఁ జేసెడివాఁడె ♦ శూద్రకులజుఁ
డనెడు శాస్త్రోక్త వివిధ వ ♦ ర్ణాశ్రమాది
ధర్మములుజూడ నేఁడు వ్య♦ త్యస్తములహా! ॥సాం॥ ౫౭

సీ. పరబోధఁ జేసెడి ♦ గురువులు ధర నిరు
తెఱఁగుల వర్తింతు ♦ తెలియ శిష్య
హృత్తాపహారకు ♦ లిత్తాపహారకు
లనఁబడుచుందు రా ♦ ఘనులు మఱియు
బోధగురువులంచు ♦ బాధాగురువులంచు
నన్వర్థనామమ్ము ♦ లనరహింతు
రట్టివారినిఁ జేరి యాశ్రయించినవారి
కన్యోన్యఫలంబు లే ♦ యనుభవంబు
లరయ గురుశబ్దమిట నీకు ♦ నమరుకతన
గురువుగనె నిన్నె నమ్మి నేఁ ♦ గొలుచువాఁడ ॥సాం॥ ౫౮

సీ. ద్రవ్య వ్యయము మొనర్చ ♦ దాతలు మూఁడు భో
గంబు నద్ధాంబు నా ♦ శం బనంగ
నందు నుత్తమపథం ♦ బరయ దానంబగు
భోగంబు మధ్యమం ♦ బగు నధమము
నాశనం బందున ♦ నయరీతి తన పూర్వ
పుణ్యవశంబునఁ ♦ బొసఁగు నందు
మొదటి రెం డిహపర ♦ ములకును సాధన
ములు నట్లుకాదేని ♦ మూఁడవదియె
గతిగ గుర్తించి కీర్తినిఁ ♦ గనని నరుఁడు
నరుఁడె? వాఁడెన్నవింతవా ♦ నరుఁడు గాక॥ సాం॥ ౭౬

సీ. సతు లెన్నఁగ మొసళ్ళు ♦ సుతులు చూడఁగ సుళ్లు
సతతమోహదురాశ ♦ సమితి నీళ్లు
రోగ శోక మదార్తి ♦ రోషాదులె కరుళ్లు
కాఁగ దాఁటఁ దరంబు ♦ కానియట్టి
ఘోర దుర్వార సం ♦ సార పారవార
మును దాట మీసేవ ♦ యనెడు నావ
లేకున్న శక్యంబె ♦ లోకమం దెంతటి
నరుల కైనను సురా ♦ సురుల కైనఁ
గాన నో దేవ నీపాద ♦ కమలసేవ
విడువకను సల్ప నన్నుదీ ♦ వింపుమయ్య॥ సాం॥ ౭౭

సీ. భువి మూఁడువైరాగ్య ♦ ములువర్తిలుచునుండు
సామాన్యముగను భూ ♦ జనులయందు
రాణించు నొకటి వ్య ♦ రాణవైరాగ్యంబు
వరికింప నది విను ♦ వఱకునుండు
సారిది రెండవది ప్ర ♦ సూతివైరాగ్యంబు
పరిసవమైనంతన ♦ బాసిపోవు
నరవి మూఁడవది శ్మ ♦ శానవైరాగ్యంబు
శవదాహమునుగుదాఁక ♦ శాంతినిచ్చు
నట్టివైరాగ్యమేనిల్చి ♦ గట్టిదైన
వారినెన్నంగఁదరమె? యె ♦ వ్వారికైన ॥సాం॥ ౫౧

సీ. పూర్వజన్మార్జిత ♦ పుణ్యపాపంబుల
భోగ దారిద్ర్యము ♦ లొప్పనఁగు నందుఁ
బుణ్యాత్ముఁడగువాఁడు ♦ భోగంబునొందును
బాపి దరిద్రుఁడై ♦ బాధలొందుఁ
గాని కాదాముష్మి ♦ కఫల మదిచూడ
విత్తవంతునికన్న ♦ బీదమిన్న
ధనికుఁడంతగ నిన్ను ♦ దలఁపఁ గోరఁడు సుమ్మి
నిజము పేద మదినమ్మి ♦ నిన్ను గొల్చుఁ
గాన దారిద్ర్యమే మోక్ష ♦ కారియనుచుఁ
దలఁతు నిలలోని యిప్పటి ♦ దారినరసి ॥సాం॥ ౫౨

సీ. పుట్టియిప్పటికిదాఁక ♦ పోరిఁబోరి జీర్ణవ
స్త్రములను విడిచి ♦ నూతనములైన
పుట్టంబులెన్నింటిఁ ♦ గట్టితిమో యింక
గిట్టునంతకు నెన్నిఁ ♦ గట్టఁగలమొ
యట్టులే దేహంబు ♦ పట్టునెంచుచుఁ
బుట్టఁగ మోదంబు ♦ గిట్ట ఖేద
మును జెందఁబోక రెం ♦ టను సమభావంబుఁ
దాల్చినవాఁడె త ♦ త్త్వజ్ఞుఁ డవని
యందు ననియందు రనుభవ ♦ మంది కొంద
ఱందు నందును నతఁడె యా ♦ నందమొందు॥సాం౬౦

సీ. ధర పురాకృత సుకృ ♦ తంబుచేతను నీదు
ఘనకృపాపాత్రత ♦ కలుగు నీదు
సత్కృపకల్గిన ♦ సత్సంగతి లభించు
సత్సంగమునను ని ♦ స్సంగ మమరు
నిస్సంగమునఁ గల్గు ♦ నిస్సంశయముగ ని
ర్మోహంబు తలఁప ని ♦ ర్మోహమునను
నిశ్చలతత్త్వఁబు ♦ నిశ్చయంబుగఁగల్గుఁ
దానజీవన్ముక్తి ♦ దనరఁగల్గు
ననుచు పెద్దలు పలికెద ♦ రనుభమువఁ
గాన దానికియత్నింతురి ♦ గాక జనులు ॥సాం॥ ౬౧

సీ. పాషాణరూపమై ♦ పరిభవించి తొలుదొల్త
పెక్కేండ్లకును తిర్గి ♦ వృక్షజాతి
యం దుద్భవంబంది ♦ యటుకొన్ని వర్షముల్
చనినయావెన్కను ♦ జంతుజన్మ
ములఁబొంది బహుకాల ♦ మును గడువఁగానంత
మానుషత్వంబున ♦ మహిజనించి
పలుపాట్లుపడి పరం ♦ పరసమార్జిత పుణ్య
ఫలముచే విూ కృపఁ ♦ బడసి తుదకు
మోక్షమునుజెందు నిటు క్రిమ ♦ ముగను జీవ
రాసు లెనుబదినాలుగు ♦ లక్ష లవని॥ గో॥ ౬౨

సీ పూర్వమందున నొక ♦ ప్పుడు పద్మసంభవుం
డమితనిద్రానక్తిఁ ♦ దైనతతిని
సోమకుండను రాక్ష ♦ సుఁడు వేదములనెల్ల
హరియించి సాగర ♦ మందుఁడాగఁ
గుటుచతోఁకయును బం ♦ గరు మేనుతో నొప్పు
తత లక్ష యోజ నా ♦ యతమునైన
మత్స్యరూపముఁదాల్చి ♦ మనుజాశనునిఁ గూల్చి
యాగమంబులఁ జిక్కు ♦ లన్నిఁదీర్చి
వేధకు నొసంగి యతనిచే ♦ వినుతులంది
నట్టినీకేను మ్రొక్కెద ♦ ననవరతము ॥గో॥ ౬౩

సీ. ఇంద్రాదిదేవత ♦ లెల్లరు దుర్వాసు
శాపంబుచేతను ♦ స్వస్వ తేజ
ములఁగోలుపడి రక్క ♦ సుల దాడికిని నోడి
సురపురివీడి నిన్ ♦ శరణు వేడి
నీయాజ్ఞ నోషధీ ♦ నిచయంబు సమకూర్చి
క్షీరవారిధియందుఁ ♦ జేర్చి మంద
రాచలంబును గవ్వ ♦ మహిరాజుఁద్రాడుఁగా
దైత్యులతో యమృఁ ♦ తంబుకొఱకుఁ
ద్రచ్చునెడ నద్రిక్రుంగఁ గూ ♦ ర్మంబవగుచు
నచలమెత్తిన నినుఁ గొల్తు ♦ నచంచభక్తి॥ సాం॥ ౬౮

సీ. దుష్టుఁడౌ హేమనే ♦ త్రుఁడు మును భూమి భా
గమ్మునెల్లను జాప ♦ గాఁగఁ జుట్టఁ
జుట్టి పాతాళంపుఁ ♦ బట్టునఁబెట్టిన
నంతయు జలమయ ♦ మైన నిల్వ
నీడఁ గానక నిన్ను ♦ వేడిన నాబ్రహ్మ
నాసికారంధ్రంబు ♦ నందునుండి
యంగుష్ఠమాత్ర దే ♦ హంబునఁబుట్టి ప
ర్వతసమ యజ్ఞవ ♦ రాహమూర్తి
వగుచు జలములమున్గి యా ♦ యసురుఁగూల్చి
నట్టి నిన్ను భజించెద ♦ ననిశమేను॥ సాం॥ ౬౯

సీ. తనదు తమ్ముని జంపఁ ♦ దాఁ గ్రుద్ధుఁడై నిన్ను
సాధింపఁ దపమును ♦ సల్పి తనకుఁ
జావులేకుండ దు ♦ ష్కరమైన వరములఁ
బరమేష్ఠివలనను ♦ బడసి కనక
కశిపుండు తదుపరిఁ ♦ గాంచి నల్వురుపుత్రు
లను వారిలోనఁ బ్ర ♦ హ్లాదుఁ డనెడు
పరమభక్తునిబట్టి ♦ బాధింప నారసిం
హాకృతిచే కంబ ♦ మందుఁ బుట్టి
ఖలునిఁ గూలిచి బాలునిఁ ♦ గాచినట్టి
భక్తవత్సల నీకు నే ♦ ప్రణుతులిడుదు॥ సాం॥ ౬౬

సీ. సురసమూహంబును ♦ వరిమి పారగ దోలి
బలిమినై నాకంబు ♦ బలిగ్రహింప
వానిని వంచించి ♦ వాసవునకు రాజ్య
మర్పింపఁగా నెంచి ♦ యసురకడకు
కాపిగోచియుఁబెట్టి ♦ కరముల దండ క
మండలు రుద్రాక్ష ♦ మాలలూని
మాయావటుండవై ♦ మహి మూఁడు పాదము
లిమ్మని మూఁడు లో ♦ కమ్ములెల్ల
నిండి యా దానవేంద్రుని ♦ నిగ్రహించి
స్వర్గ మింద్రున కొసఁగిన ♦ స్వామివీవె॥ సాం॥ ౬౭

సీ. జగతిని బూర్వంబు ♦ జమదగ్నికిని నీవు
పరశురాముండనఁ ♦ బ్రభవమొంది
యిరువదియొక్కమా ♦ రిలను క్షత్రియవర్గ
ములఁబట్టి చెండాడి ♦ మోదమలరఁ
దద్రక్తధారచే ♦ తను బితృతృప్తినిఁ
గావించి భూమిని ♦ గశ్యపునకు
దానంబొసఁగి ఖ్యాతిఁ ♦ దనరితి విల శాప
చాపంబులను లేరు ♦ సములటంచు
అట్టి జమదగ్నిజాకృతి ♦ యశముఁ గొన్న
నిన్ను నెన్నఁగ శక్యంబె? ♦ సన్నుతాంగ! ॥సాం॥ ౬౮

సీ. దశరథునకుఁ బుట్టి ♦ తాటకఁ బడగొట్టి
మఖముగాచియు శిల ♦ మగువఁ జేసి
శివునిచాపముఁదుంచి ♦ సీతఁగైకొనిమించి
పరశురామునిఁగేరి ♦ పురికిఁ జేరి
వనమునకును బోయి ♦ వనితను గోల్పోయి
వాలిని మట్టి యా ♦ వార్ధిఁ గట్టి
లంకాపురినిఁ జొచ్చి ♦ రాక్షసులను వ్రచ్చి
స్వపురంబునకువచ్చి ♦ జనులు మెచ్చి
నిన్నుగొనియాడ రాజ్యంబు ♦ నియతి నేలి
నట్టి శ్రీరామమూర్తి వీ ♦ వరయఁగావె? ॥సాం॥ ౬౯

సీ. మునునీవు శేషాంశ ♦ మున వసుదేవుని
సతి రోహిణీయందు ♦ జననమొంది
కాళిందిమడువు నా ♦ కర్షించి సీరాగ్రి
మునను నెంతయుఁ జోద్య ♦ ముగను భువిని
ఘనముగఁ గృష్ణున ♦ గ్రజుఁడని రేవతీ
రమణుండవని జనుల్ ♦ పరిస్తుతింప
హలమున లాయుధం ♦ బులను దాలిచి ప్రలం
బాదిరాక్షసుల న ♦ త్యలఘుశక్తి
దుంచి యనుచిత కీర్తి గ ♦ డించి మించి
తించుక నుతించ నిను నా వి ♦ రించివశమె?॥ సా॥ ౭౦

సీ. వేదవేదాంగాది ♦ విద్యావిహీనులై
శద్ధర్మముల మదిఁ ♦ దలఁపకెందు
మూఢభక్తిని యాగ ♦ ములు జాతరలు నంచు
నెంతయుజనులు దు ♦ రంతమైన
పాపభీతికిని నే ♦ పాటియు వెరువక
హింసాదికృత్యముల్ ♦ లెలమిఁ జేయ
మును "యహింసా పర ♦ మోధర్మ" మనుచును
బోధింపఁగా నీవు ♦ బుద్ధుఁడవయి
యవతరించితికాదె ! మ ♦ హానుభావ
నీకు జోహారులిడుదు న ♦ నేకవిధుల॥సా॥ ౭౧

సీ. వర్ణసంకరులౌచుఁ • బ్రజలు దయాదాన
సత్య ధర్మాచార • సరణిమాని
పరనింద పరహింస • జరుపుచుఁ బరదార
పరధన సంగ్రహ • పరులు నగుచు
నన్యాయ విత్తార్జ • నాసక్తులై క్రోధ
కామ లోభ మదాధి • కారులగుచు
వర్తింప, నీచులు • ప్రభువులై బాధింప;
హయవాహనుఁడవై • హస్తమందు
ఖడ్గమును బూని కల్కివై • కలియుగాంత
మందు దుష్టులఁ దునుమంగ • నవతరింతు!॥సాం॥ 22

సీ. శ్రీశ! హృషీకేశ! • కేశవ! సర్వేశ!
పద్మదళాక్ష! యా • పన్నరక్ష!
కరివరదాయక! • సురవరనాయక!
ధర ధరామరతోష! • పరమపురుష!
ఆదిదేవాచ్యుత! • యోగమాంతార్చిత!
వాసుదేవ! మురారి! • వరద! శౌరి!
చిత్రింబు మిగులఁ బ • విత్రింబు సురనుతి
పాత్రింబు నగు నీ చ • రిత్ర మొదుఁ
జననమును బాలలీలలు • సంగ్రహముగఁ
దెల్పెదను జిత్తగింపుము • దేవదేవ!॥సాం॥ 23

సీ. కంస మాగధ చైద్య ♦ కౌరవ నర కాది
దుష్టభూపతిపీడ ♦ తోరముగుట
కముభరంబును మోయఁ ♦ గాలేక భూదేవి
గోరూపమై తన ♦ గోడు బ్రహ్మ
కడ కేగి తెల్ప నీ ♦ కడ కజుం డమరుల
తోడ రాఁ గని వారి ♦ తోడ నీవు
భూలోకమున నేను ♦ బుట్టెద యాదవ
కులమున మీరలుఁ ♦ గూడఁ బుట్టుఁ
డనఁగ మీయాజ్ఞఁ గొని సుర ♦ లతిముదమున
విలయముల కేగిరంత నీ ♦ దలఁచికొనుచు॥సాం॥ ౨౮

సీ. దేవకి నట వసు ♦ దేవుండు పెండ్లియై
కంసుండు రథమును ♦ గడపఁ దనదు
పురమునుగూరిచి ♦ పోవుచుండఁగ దివ్య
వాణి కంసునితోడఁ ♦ బలికె నోరి
యీపె యష్టమగర్భ ♦ మేపడంచును నిన్ను
దుర్ల్లుకమున వాఁడు ♦ తుర్ల్లిపడుచు
సోదరిఁ దెగ వ్రేయఁ ♦ జూడ నా వసుదేవుఁ
డడ్డమై పుట్టిన ♦ యర్భకులను
జంపఁగానిత్తునని కడు ♦ సవినయముగ
వేడుకొన మత్సరము మాని ♦ విడిచె నపుడు॥సాం॥ ౨౯

సీ. అంతఁ గొన్ని దినంబు ♦ లరుగ దేవకికి నా
ద్యరు పుత్రికలుఁబుట్టి ♦ రరిదిగాను
వారినిఁ గంసుండు ♦ వధియించె నష్టమ
గర్భస్థుఁడగు బాలుఁ ♦ గాచె యోగ
మాయ పిమ్మట నష్ట ♦ మ ప్రసవంబున
తల్లిదండ్రులు తొల్లి ♦ తపమునల్ప
మెచ్చి వారలకు నీ ♦ విచ్చినవరములఁ
జేసి లోకముల ర ♦ క్షించుకొఱకు
నవని లీలామనుష్యత్వ ♦ మమరఁదాల్చి
యవతరించితి వీవు మ ♦ హానుభావ॥ సాం॥ ౭౬

సీ. ఆయాలుమగలుఁ గ ♦ న్నారఁగా నినుగాంచి
కడకుఁ గంసుని భయ ♦ కారణమునఁ
గొనిచని వ్రేపల్లె ♦ కును నందునింటను
నినుడించి యోగమా ♦ యను గ్రహించి
యీ వెతిగించి న ♦ ట్లిట దేఁగ వసుదేవుఁ
డంత బాలికయేడ్వ ♦ నచటిభటులు
వినిచెప్ప కంసుండు ♦ కనుగవ నిప్పులు
రాల నేతెంచి యా ♦ బాలఁబట్టి
దిగిచి నేలను గొట్టంగ ♦ దివికినెగసి
పలికె నినుఁజంపఁగాఁబుట్టె ♦ బాలుఁడనుచు॥ సాం॥ ౭౭

సీ. ఆమాటవిని కంసుఁ ♦ డడలుచు నెంతయుఁ
జిడిముడిపాటుతో ♦ చేరిగృహము
మంత్రులతో యోగ ♦ మాయ పల్కినవార్తఁ
జెప్పఁగా విని వారు ♦ చెప్పినట్లు
గో విప్రులను జంపఁ ♦ గొందఱఁబంపియు
విషమిడి బాలుగ ♦ వెదకిచంప
నొక్కరక్కసిఁబంప ♦ నూరూర నది పయో
ధరవిషంబునను బా ♦ లురను నెల్లఁ
జంపుచును నిన్నుఁ జంప యో ♦ జంప దానిఁ
జంపితివి బాలకుఁడవె? యో ♦ జంపనీవు॥సాం॥ ౭౨

సీ. నయముప్ప నీకు జ ♦ న్మదినోత్సవము సల్ప
నెంచి తల్లి యశోద ♦ యెలమి గోప
గోపికాజనములఁ ♦ గూరిచి నృత్యగీ
తంబులందలి పప్రమో ♦ దంబుకతనఁ
బనిపందడిని నీకుఁ ♦ బాలీయమరచిన
నాఁకట నేడ్చుచు ♦ నచటనున్న
శకటంబుఁ దన్నిన ♦ శకలంబులై మింటి
కెగసిపడంగ నం ♦ దెల్లవారు
జడిసితి వటంచు నీకు ర ♦ క్షలను బెట్టి
చోద్యముగఁజూచిరందురీ ♦ చోద్యమేమి ?॥సాం॥ ౭౩

సీ. ఇట్లొకనాఁడు పా ♦ లిచ్చుచున్న యశోద
కును భారమైదోపఁ ♦ గొండపగిది
నాశ్చర్యమగ్నయై ♦ యాపె నిన్నిల డింపఁ
గను తృణావర్తుఁడు ♦ కంసుపంపు
నను సుడిగాలియై ♦ నిను నాకసంబున
కును గొనిపోవ నె ♦ క్కుఁడు భరంబు
గను దోపఁగాఁజేసి ♦ కంఠకీలితహస్త
యుగ్మముచే వాని ♦ నుర్వికీడ్చి
చంపితివి నివ్వెఱన్బడ ♦ సకలజనము
లిట్టిజగజెట్టి వెఁటు చిట్టి ♦ పట్టివాఁడు ॥సా॥ ౮౦

సీ. తనయింటఁ బెరుగుఁబాల్ ♦ ద్రావి భాండంబులఁ
బగులఁగొట్టితివన్న ♦ భామయొకతె
తనగృహంబున వెన్నఁ ♦ దిని తనకోడలి
మూతిఁ బూసితివన్న ♦ ముగుదయొకతె
తనగేహమున ఘృతం ♦ బును ద్రావి కడవలఁ
బొరుగింట నిడితన్న ♦ పొలతియొకతె
తనగీమునను బెగ్గఁ ♦ దఱచఁ బైటనుబట్టి
పడనీడ్చితివటన్న ♦ పడఁతియొకతె
నేరములు తల్లితోఁ దెల్ప ♦ నేరనట్లు
వగలఁబోతివి సామాన్య ♦ బాలుపగిది॥సా॥ ౮౧

సీ. బలభద్రిముఖ గోప ♦ బాలురతో నాట
పాటలయం దొక ♦ నాఁటిపొద్దు
మన్ను దింటివటంచు ♦ నన్న తల్లికిఁదెల్ప
నమ్మకోపించి యా ♦ స్యమ్ముఁ జూపు
మనఁ జతుర్దశ భువ ♦ నాన్విత సర్వ సు
పర్వ పర్వత వన ♦ వనధి నర మృ
గాది సకల చరాచ ♦ రాత్మకమైనట్టి
బ్రహ్మాండభాండంబుఁ ♦ బరగ నీదు
వదనమునఁజూపి ♦ తెంతటివారికైనఁ
జూపనిమహాద్భుతంబు య ♦ శోద కపుడు॥సాం॥ ౭౨

సీ. తల్లి యశోద యెం ♦ తయుఁ బెర్గుఁదరచుచు
నుండగా మెల్లన ♦ దండఁజేరి
వెన్నఁబెట్టుమటంచు ♦ చిన్నిచేతులఁజాచి
కవ్వంబు నటు నిటు ♦ కదలకుండఁ
బట్టి యేడ్చుచు నామె ♦ యట్టెపోవఁగఁజూచి
భాండమంతయు భిన్న ♦ పరుప జనని
పట్టరానట్టి కో ♦ పంబున నెట్టెటో
పట్టరానట్టి నిన్ ♦ బట్టి రోటఁ
గట్టె మద్దులనెట్టి ని ♦ ర్గమితశాపు
లనఁగఁజేసితి ధనదుని ♦ తనయుల నిల॥సాం॥ ౭౩

సీ. ఇటుకొన్నినాళ్లు క ♦ పటబాలలీలల
గడప మహాపదల్ ♦ గలిగెనిచటఁ
గావున నిట నుండఁ ♦ గాదని యోజించి
యందఱు శిశు పశు ♦ బృందముగను
బృందావనికిఁబోయి ♦ యందుండి యొకనాఁడు
వత్సంబులను మేఁప ♦ వత్సరూప
దైత్యుఁడొక్కఁడు రాఁగ ♦ దానిఁబోల్చి వధింప
బలవేషమూని మ ♦ ఱొకదినంబు
సురరిపుఁడొకండు రాఁగఁ జం ♦ చువునఁబట్టి
చీల్చి చంపితివౌర వి ♦ చిత్రముగను॥సాం॥ ౧౪

సీ. గోవుల మేఁప బృం ♦ దావనంబున కేగు
తఱి వత్సదైత్యుని ♦ తమ్ముఁడైన
యఘనామరాక్షసుం ♦ డజగరరూపుఁడై
దారి కడ్డఁబుగా ♦ ధరణిఁబండి
విరివిగ వదనఁబు ♦ విప్పి గో గోపబా
లురమ్రింగఁ దద్రక్ష ♦ కొఱకు వాని
కంఠబిలముఁజొచ్చి ♦ కడుఁబెంచి దేహంబు
నూపిరివెడలక ♦ యుబ్బి చావఁ
జేసి గో గోపకులను ర ♦ క్షింపఁజూచి
విరులవానలుకురిసిరి ♦ వేడ్కసురలు॥సాం॥ ౧౫

సీ. ఒకనాఁడు నీవు రే ♦ పకడ బాలురఁగూడి
చల్దిఁగుడిచెడు వేడ్క ♦ నందడింప
గోవుల లేగలఁ ♦ గూర్చిభుజములఁ
గావళ్లు చిక్కాము ♦ ల్గడలుకొనఁగ
వేణు వేత్రంబుల, ♦ విరులదండలఁ దాల్చి
యొకరికావళ్లొక ♦ రొడిసికొనుచు
గిరురించుచును వింత ♦ కేకలు వేయుచు
బృందావనస్థలి ♦ యందుఁజేరి
గోపబాలురమధ్యను ♦ గూరుచుండి
సరసమాడుచుఁ గుడిచితి ♦ చల్ది నీవు॥సాం॥ ౮౬

సీ. బాలకుం డీతఁడౌ ♦ బ్భంగి నఘాసుర
గర్భస్థ గో గోప ♦ కార్భకులను
బ్రతికించె నితనిప్ర ♦ భావంబుఁ గనుగొంద
మంచుఁ జల్దినీఁదిను ♦ నంతలోనఁ
గమలాసనుండు లే ♦ గల గోపకుల నెల్ల
కొండగుహానుడాపఁ ♦ గొంతకాల
మేపుమీఱఁగ నను ♦ రూపాధికంబులౌ
గోప గో శిశువుల ♦ రూపములను
దాల్చి తల్లులకడనుండి ♦ తమ్మిచూలి
గర్వమడగించినట్టి యా ♦ ఘనుఁడ వీవు॥సాం॥ ౮౭

సీ. అలనాఁడు గోపాల ♦ కులఁగూడి గోవుల
మేఁపుచుఁ దృష్ణచే ♦ మిగులఁ డస్సి
కాళిందిమడువునఁ ♦ గల నీరములఁగ్రోలఁ
బోయి ప్రాణములఁ గో ♦ ల్పోయినట్టి
పశు శిశు వ్రాతంబుఁ ♦ బ్రతికించి కాళాహిఁ
జంపఁగా నెంచి వృ ♦ క్షంబునుండి
కటిచేలముబిగించి ♦ కడునంబరంబునఁ
గుప్పించిమించి మ ♦ డ్గునకుదుమికి
ఫణిఫణంబుల నీ పాద ♦ పద్మములను
మోపి నటనముసల్పి త ♦ మోఘముగను॥ సాం॥ ౮౮

సీ. కాళిందిమడ్డువునఁ ♦ గడుపార జలములఁ
గ్రోలియు నీవు నా ♦ గోపగణము
నాటలాడుచు నొక్క ♦ చోటనుండంగఁ బ్ర
లంబుండు బాలవే ♦ షంబునూని
రాఁగ వానిని బల ♦ రామునిచే నంత
మొందించి మఱిదిన ♦ మందు మరలఁ
బసులఁగాచుచు గోప ♦ బాలురు వనమునఁ
గ్రుమ్మరఁ గార్చిచ్చు ♦ గ్రమ్మఁగానఁగ
మ్రింగిదావాగ్ని నంతట ♦ సంగడీల
రక్షణమొనర్చితివి జగ ♦ ద్రక్ష నీవు॥ సాం॥ ౮౯

సీ. శారదరాకా ని ♦ శాసమయంబున
గోపికలందఱుఁ ♦ గోరి నీదు
యొద్దకు రాఁగ నా ♦ యువిదలతోడ రా
సక్రీడ నెంతో యా ♦ సక్తి మీఱ
జరిపితి గోపిక ♦ సరసన నీవు నీ
సరస గోపిక పర ♦ స్పర కరాబ్జ
బంధనంబులఁ జుట్టుఁ ♦ బరగుచు మధ్యను
మురళిగానము జగ ♦ న్మోహనముగఁ
జేసి గోపికలంగూడి ♦ చిత్రగతుల
జలవిహారమునల్పితి ♦ శ్రీమముపాయ॥సాం॥ ౯౦

సీ. ధరణిపై సవ్యపా ♦ దముమోపి దక్షిణ
చరణంబు జానువు ♦ సరస నిల్పి
కటి భుజ శిర ములఁ ♦ గ్రమ వక్రములఁజేసి
వేణినిఁ బింఛంబు ♦ వెలయఁ జుట్టి
కస్తురిచుక్క చ ♦ క్కఁగ ఫాలమునదిద్ది
యరమోడ్చి కనుఁగవ ♦ నందముగను
పల్లవాధరభాగ ♦ పరిసరమందున
వేణువుఁగీలించి ♦ పాణిఁ బట్టి
గానమును బాడితివి ధేను ♦ గణము మేఁత
విడచి విన గోప గోపికల్ ♦ వివశతఁగన॥సాం॥ ౯౧

సీ. అంత హేమంతర్తు ♦ వాదిని నందుని
మందఁ గుమారికా ♦ బృందమెల్ల
నందంబుగాఁగఁ గా ♦ ళిందీతటంబునఁ
జేరి భర్తగ నిన్ను ♦ గోరి భక్తి
గౌరీవ్రతంబును ♦ గావించి మాసంబు
దీక్షవహించి న ♦ దీజలంబు
లందు వివస్త్రలై ♦ యవగాహమొనరింప
నడిఁగాంచి నీ నరి ♦ సఖులఁగూడి
తటమునందున్న వారల ♦ పటములెల్లఁ
బట్టుకొనిపోయి చెట్టుపైఁ ♦ బెట్టితీవు॥ సాం॥ ౯౨

సీ. కోకలిమ్మని నిన్ను ♦ గోపికల్గోరఁ బ్రి
సన్నుండవై యిచ్చి ♦ సఖులతోడఁ
బసుల మేఁపుచు నందె ♦ వసియింప బాలకు
లాకటిబాధచే ♦ నన్నమడుగ
భక్తిరాండ్రగు ముని ♦ పత్నులకడకేగి
గొని తెచ్చితినుఁడన ♦ గోపకులును
యాగశాలలఁ జేరి ♦ యజ్వలనడుగంగఁ
దరుమ వారలు వారి ♦ తరుణులెల్ల
నత్తమామలు భర్తలు ♦ నడ్డగింప
నరకుగొన కన్నమును దెచ్చి ♦ నరుసనిడిరి॥ సాం॥ ౯౩

సీ. నందాదులందఱా • నందంబుతో నింద్ర
యాగంబుఁ జేసెద • రంచుఁ దెలిసి
తగురీతి వారికిం • తయు బోధఁ గావించి
యద్ద్రాని మాన్పించి • యద్రి పూజఁ
గావింపుఁడన వారు • గావించి తెచ్చిన
భక్ష్యభోజ్యంబులఁ • బర్వతంపు
రూపుమైఁ గొనఁ దీక్ష • రూక్షేక్షణుండునై
సప్తదివసములు పా • షాణవృష్టిఁ
గురియ నింద్రుఁడు, శైలము • గొడుగు గాఁగఁ
బట్టి గో గోపకులను గా • పాడితీవు॥ సాం॥ ౯౪

సీ. అంత నొక్కదినంబు • నంబికాటవికి నం
దాదులందఱు వేగ • నరిగి పార్వ
తీ శంకరుల పూజఁ • దీరచి గో భూ హి
రణ్యాది దాన ధ • ర్మము లొనర్చి
జలపాన నియమంబు • సల్పి యందఱు నిద్రఁ
జెందియుండంగను • నందు నొక్క
కాకోదరము మ్రింగఁ • గా నున్న నందుండు
హా కృష్ణ! యనిపిల్చు • నంత నీవు
వచ్చి పదతాడనమున నా • పన్నగమును
గూల్చి గంధర్వశాపంబుఁ • దీర్చినావు॥ సాం॥ ౯౫

సీ. తదనంతరమున ను ♦ త్సవసమాప్తిని జేసి
యుండఁగ నా మంద ♦ యందుఁ జేర
రాముఁ డీవును గోప ♦ రాములతోఁ గ్రీడ
సల్ప నచ్చటికిని ♦ శంఖచూడుఁ
డరుదెంచి గోపనుం ♦ దరులను గొనిపోవ
వానిని ననిఁ ద్రుంచి ♦ వారినెల్ల
విడిపించి తొకనాఁడు ♦ వృషభాసురుఁడు రాఁగ
వానిఁ గొమ్ములఁ బట్టి ♦ వధ మొనర్పఁ
గేశి, వ్యోముఁడుఁ జను దేరఁ ♦ గెరలి వారిఁ
గూల్చితివి విరులసోనలు ♦ కురియ సురలు॥సాం॥ ౯౬

సీ, బలరాముఁడును నీవుఁ ♦ బ్రభవించి బృందావ
నంబున నుండుట ♦ నారదుండు
తెలుప నీ కా రావించి ♦ ధీరతఁ జంప నీ
కడకు ధనుర్యాగ ♦ కైతవమునఁ
గ్రూరుండు కంసుఁ డ ♦ క్రూరునిఁ బంప న
క్రూరుని నీవు ♦ న క్రూరుఁ గాఁగ
భావించి యతని సం ♦ భావించి పయనమై
రామునితో మధు ♦ రాపురంబు
చేర ననిమిషులై పుర ♦ స్త్రీ పురుషులు
నిన్ను వర్ణనచేసి ర ♦ నేకవిధుల॥సాం॥ ౯౭

సీ. ద్వారంబుకడ కీరు ♦ చేరఁ జాకిరియొకండు
రాచదుస్తులుఁగొని ♦ రాఁగ వటుకు
వానినిఁగూల్చి యు ♦ వ్వాసినిఁదాల్చి సు
దాముని౦టను పువ్వు ♦ దామములను
గని కొని ధరియించి ♦ గంధాదిలేపముల్
లోనఁగిన కుబ్జను ♦ నుజ్వలాంగిఁ
జేసియుఁ జౌరులి ♦ చ్చిన కానుక విడెముల
నరవిఁగొంచును ధను ♦ శ్శాలకరిగి
దండిధను వట విఱిచి త ♦ ద్రక్షకులను
జెండితిరి రాముఁడిపు డో ♦ ర్దండలీల॥ గోపా॥ ౮౭

సీ. రాముఁ డీవును వచ్చి ♦ రజకాదులనువధించి
ధనువు విఱిచినవార్త ♦ తనకుఁ దెలియఁ
గడుభీతి నా రాత్రిఁ ♦ గడపి యాకంసుండు
మఱునాఁడు రమ్యమౌ ♦ మల్లరంగ
మమరిచి నందాదు ♦ లందఱకును నుచి
తాసనంబులనిడి ♦ యందుఁ దాను
మంత్రులతో ఖిన్న ♦ మానసుఁడై చు సిం
హాసనంబుననుండె ♦ నపుడు రంగ
మునకుఁ జాణూరముష్టికు ♦ లనెడు దండి
మల్లు లేతెంచి మోది రే ♦ మఱక భేరి॥ గోపా॥ ౮౮

సీ. అదుందుభిధ్వాను • లాలించి దర్శన
కుతుకం బుమై యలం • కృతులునగుచు
రంగంబు మార్గిలకుఁ • జెంగలించు చుఁ జేరి
కువలయాపీడాఖ్య • కుంజరమును
జేరి శవఁ గని యది • భీకరాకృతితోడఁ
గవిసిన దానిఁ జో • కార్చి దంత
ములఁగొని యచటివా • రలదున్మి సంతసం
బునుమీరఁగను రంగ • మునను జేరఁగ
మొనసి కరినివధించుట • వినుచుఁ గంసుఁ
డుల్లమునఁ దల్లడిల్లి భీ • తిల్లె నంత॥సాం॥ ౧౦౦

సీ. చాణూర ముష్టికుల్ • సాహసంబున మిమ్ము
బాలకులనియెంచి • ప్రల్లదములు
పలుక నా పలుకుల • కలిగి రాముం డీవు
నమ్ము చూతురు మాబ • లమ్ములనఁగ
వారు భయంకరా • కారులై మిము మహా
శూరతఁదాఁకఁ జా • ణూరు నీవు,
ముష్టికు రాముఁడు, • మొనసి హాహారావ
చూపఱులెల్లరుఁ • జోద్యమంద
మల్లయుద్ధంబుఁ జేసి యా • మల్లవరులఁ
గూల్చితిరి కంసుఁ డెంతయుఁ • గుంద మదిని॥సాం॥౧౦౧

సీ. అంత నాతండు కా ♦ లాగ్ని పోలిక మండి
పడి మంత్రులను జూచి ♦ పలికె నిటుల
గోపకులను వెడలఁ ♦ గొట్టుఁడు, నందునిఁ
గట్టుఁడు, గొల్లలఁ ♦ గొట్టుఁ, డవనిఁ
గూల్చుఁడు వసుదేవుఁ, ♦ గొంకకఁ దండ్రినిఁ
జంపుఁడు; మీరను ♦ సమయమందు
మదగజేంద్రంబుపై ♦ మార్కొను సింహంబు
పగిది నా కంసుని ♦ పైకి దుమికి
కేశములఁబట్టి విదళించి ♦ క్రిందికీడ్చి
యుక్కడఁచితొక్కి వేటున ♦ నక్కజముగ ॥సాం॥ ౧౦౨

సీ. వైరానుబంధంబు ♦ వలన ని న్నేప్రొద్దుఁ
దలఁచిన యంత ♦ మాత్రంబుచేత
వాని దేహమునుండి ♦ వెలువడుఁగన నొక్క
తేజంబు వెడలి నీ ♦ దేహమందుఁ
జొరఁగ ని న్నేప్రొద్దు ♦ సుస్థిరమతులౌచుఁ
త్రికరణముల నొక్క ♦ తీరుఁగాఁగ
భజియించువారి కే ♦ పదవి నొసంగెదో
తెలియంగరాదు నీ ♦ దివ్యమహిమ
మఱి హరాదులకును నరు ♦ లనఁగ నెంత
లీలనాడింతు బొమ్మల ♦ బోలె జనుల ॥సాం॥ ౧౦౩

సీ. కంసుఁ డీల్గినయంతఁ ♦ గడునల్గి యాతని
సోదరులైన న్య ♦ గ్రోధ గుహ్యు
లాదిగాఁగలవార ♦ లాయుధపాణులై
గోపాలు రన నెంత ♦ కొట్టుఁ డనుచుఁ
జైకిరా నందఱఁ ♦ బట్టి రాముఁడు మట్టు
పెట్టిన నంతటఁ ♦ బెల్లుగాఁగ
సుమ వర్షములు గురిసి ♦ రమరులు దుందుభి
ధ్వనులు దిక్కులు వ్రీతి ♦ ధ్వనులుసెలఁగ
నంత లోకంబులన్ని యా ♦ నంద మొందె
నారదుం డాకనంబున ♦ నాట్యమాడె ॥సాం॥ ౧౦౪

సీ. అటుపైనఁ జెరసాల ♦ యందున్న మీ తల్లి
దండ్రులఁ జేరి బంధముల నూడ్చి
యుచిత భాషణముల ♦ నోదార్చికడుభక్తిఁ
గంసునిభీతిచే ♦ కడుఁగృశించి
దేశాంతరంబులఁ ♦ దిరుగు దశార్హాది
జ్ఞాతి సంబంధులఁ ♦ బ్రీతితోడ
రావించి స్వస్థాన ♦ రమ్యవాసులఁ జేసి
ప్రజలెల్లరును నిను ♦ బ్రస్తుతింప
నొనర మాతామహుండగు ♦ నుగ్రసేను
రాజుఁగాఁ జేసితివి మధు ♦ రాపురికిని ॥సాం॥ ౧౦౫

సీ. దండి కౌండిన్య గో ♦ త్రుండు నాపస్తంబ
సూత్రుండుఁ గృష్ణయ ♦ జుస్సు శాఖ
యందుఁ బన్నొలాన్వ ♦ యాంబుధి కైరవ
మిత్రుండుఁ బరమ ప ♦ విత్రుఁ డనఁగఁ
బరగు లక్ష్మినర్సు ♦ పౌత్రుండ నారసిం
హాహ్వాయునకును సు ♦ బ్బాంబికకును
బుత్రుండ సజ్జన ♦ మిత్రుండఁబరమా ణు
మాత్రుండ నీ కృపా ♦ పాత్రునిగను
జూచి, కొను నను వేంకట ♦ సుబ్బరాయ
శర్మ యందు రానంగితి ♦ శతకమొందు ॥ సా॥౧౦౬

సీ॥ ఉర్వీఁద్రియస్త్రింశ ♦ దుత్తరే కోనవిం
శతి శతతమ హాయన ♦ శకమునందు
రచియించితిని దీని ♦ వ్రాసినఁ జదివిన
వినినవారికి పాడి ♦ విరివిచేసి
ధనధాన్య సంపదల్ ♦ తఱుచు కల్గఁగఁ జేసి
పుత్రి పౌత్రులను బెం ♦ పుగను జేసి
ఆయురారోగ్య సౌ ♦ ఖ్యాభివృద్ధినిఁ జేసి
యెల్లకోర్కుల ఫలి ♦ యింపఁ జేసి
స్వకులధర్మంబు విడక నిర ♦ సతముఁ గొల్వఁ
జేసిమోక్షంబొసంగిర ♦ క్షింపుమయ్య॥ ౧౦౭

సీ. జయమంగళం బిదె ♦ శక్రార్చితపదార
విందగోవింద ము ♦ కుంద నీకు
శుభమంగళం బిదె ♦ సుమశర శతకోటి
తేజ సజ్జన కల్ప ♦ భూజ నీకు
నిత్యమంగళ మిదె ♦ సత్య చిదానంద
రూప యాదవకుల ♦ దీప నీకు
దివ్యమంగళ మిదె ♦ యావ్యయ కంస సం
హార సన్ముని హృద్వి ♦ హార నీకు
ధీరమంగళమిదె నిర్వి ♦ కార నీకు
భూరిమంగళ మిదె తత్వ ♦ సార నీకు
సాంద్రకరుణాలవాల వి ♦ శాలశీల
భక్తజనజాలలోల గో ♦ పాలబాల ॥ ౧౦౮

సంపూర్ణము.



విజయ ముద్రాక్షరశాల, బాపట్ల.

ఓమ్

# ॥ శ్రీ భగవత్ స్తోత్రాష్టకము ॥

౧ *ప్రాతస్స్మరామి జలజాప్త మృగాంక నేత్రం
దారిద్ర్య దుష్కృత మహావన వీతిహోత్రం
సాత్రాజితీ ధరణి భీష్మసుతా కళత్రం
దుర్వార భీకర భవార్ణవ యానపాత్రమ్ ॥

౨ ప్రాతర్నమామి సురతోష మజాండపోషం
యోగీంద్రమానసవిహార సుఖావహారం
భోగే శయాన మనఘం ప్రణుతామరౌఘం
సంసారహేతు భవపాశ వినాశ నాశమ్ ॥

౩ ప్రాతర్వ్రజామి శరణం చరణం మురారేః
సంసారసింధుతరణం తరుణారుణాభం
బ్రహ్మేంద్రమౌళి మణిసంచయ కాంతి కాంతం
గంగాంబుపూర పరిపూత జగత్కరండమ్ ॥

౪ ప్రాతర్వదామి భువనత్రితయే ముకుంద
త్వత్తుల్య దైవతమణి స్సుతరాం నహీతి
దేవేశ! దేవ! వసుదేవజ! దేవవంద్య!
మేఘోపమాంగ నిజభక్త హృదబ్జ భృంగ ॥

---

*ప్రాతః అనుచోట ,,సాయం'' అని కూడా చెప్పవచ్చును.

౫ ప్రాతర్దదామి మనసా పరికల్ప్య చాఽహం
త్వత్ప్రీతయే సుమ సుగంధ ఫలాంబు జాలం
దీనాత్మకే మయి సదా దయయా దయాబ్ధే
గృహ్ణీష్వ పాలయ హరే! తవ కింకరం మామ్ ॥

౬ ప్రాతశ్శృణోమి తవ దివ్యకథా స్సుభక్త్యా
తత్సంస్మర న్హృదివిచింత్య భవన్మహత్వం
త్వత్పాదపద్మఘనపోత ముపాగతం మాం
సంతారయాద్య దురితౌఘ పయోనిధేశ్చ

౭ ప్రాతః కరోమి భవదంఘ్రిసరోజపూజాం
చిత్తాంబుజేన మునిచిత్తసరోజవాస
భక్త్యాసహ భవమహార్ణవ తారణాయ
పద్మోద్భవాదినుత పద్మభవాండపోష ॥

౮ ప్రాతర్భజామి మనసా వపుషా చ వాచా
త్వాం కృష్ణ! యాని మనసా వపుషా చ వాచా
సంఛిద్య తాని దురితాని మయాకృతాని
సంరక్ష మాం కరుణయా కరుణాపయోధే ॥

౯ సంధ్యాద్వయేఽష్టక మిదం ఖలు యే పఠంతి
పన్నాలవంశ కలశాబ్ధి నిశాకరేణ
శ్రీ సుబ్బరాయ కవినా కృత మిష్టసిద్ధిం
తే ప్రాప్నువంతి పరమాం పదవీ మహాంఽతే ॥

ఓం తత్సత్

1 శ్రీ వెంకటేశ్వర గ్రంథాలయము 58

# పరికటన.



## ఏతద్గ్రంథకర్తకృతగ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | శ్రీజనార్దన శతకము | 0-2-0 |
| 2 | జనార్దనస్తవము | 0-1-0 |
| 3 | వేంకటేశ్వర దండకము | 0-1-0 |
| 4 | వేంకటేశ్వర తారావళి | 0-0-6 |
| 5 | రామాయణ సంగ్రహము సీసమాలిక | 0-1-0 |
| 6 | కలిమహిమ ఏకాక్షరప్రాస | 0-0-6 |

ఇవి పండితపామరులకు సుబోధకంబగు సులభశైలి కలిగి, పండితాదరణవడసి, నిత్యపఠనయోగ్యమగు భక్తి రసముతోఁగూడియున్నవి. ఈగోపాలశతకముతోసహా అన్నిపుస్తకముల నొకేపర్యాయము కొనువారికి రు.0-8-0కు వి. పి. గా పంపఁబడును. విడిగాకోరువారు ముందుగా మూల్యమునకు పోస్టుబిళ్ళలు పంపవలయును.

వ్రాయువారు:—

బొడ్డుపల్లి సత్యనారాయణ.
కర్లపాలెం.
బాపట్ల తాలూకా (పోస్టు)
గుంటూరు జిల్లా

అనివ్రాసినఁ బడయఁగలరు— పోస్టుఖర్చులు ప్రత్యేకము



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B198 |
| పుస్తకం పేరు | గోపాల శతకము |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, B, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseema |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |